Registered No. M-4484

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ సెప్టంబరు నెల 11 వ తేది శుక్రవారం [నె 36 రు.

## ఇండియానుగూర్చి అక్షరాజ్యాల ప్రచారం.

### తెలివితక్కువగ బయల్పడుట.

అక్షరాజ్యాల రేడియో స్టేషనులు, ఇండియాను గూర్చి యిపుడు యింకా యెక్కువ అసత్యాలు ప్రచారం చేస్తున్నాయి. అవి ఎవరి నుద్దేశించి చెప్పుచున్నవో ఆ దేశంలోనుండే మాట్లాడుచున్నట్లు నమ్మించడానికి చాల శక్తివంతములగు ప్రసార యంత్రాలను ఉపయోగించుచున్నవి. జర్మనీ స్వాధీనంలో ఆరు రేడియో స్టేషనులు యూరోపులో వివిధ చోట్లనున్నవి బ్రిటిషు ప్రజలలో కొందరిని మోసగించుటకై అవి ఇంగ్లాండునుండే మాట్లాడుచున్నట్లు మాటలు ప్రసారం చేయుచుండును. 1940 వేసంగిలో ఇంగ్లాండుపై విమానదాడి జరిగినపుడు యిటువంటి ప్రచారం ఎక్కువ జరిగింది. దానివలన బ్రిటిషువారికి జర్మనులపై ద్వేషాన్ని పెంచిందికాని యింకేవిధంగా లాభించకుండెను. అయినను ఎంత ఎక్కువసార్లు అసత్యం చెపితే అంత లాభముండునని శత్రువు లీప్రచారం యింకా సాగించుచునే యున్నారు

అటువంటి బూటకపు రేడియో స్టేషనునుండి ఇండియాకు అందజేయుచున్న ప్రచారానికి సరియైన నిదర్శనం జూను 21 వ తేదీన వినబడెను. "న్యూ బ్రిటిషు బ్రాడుకాస్టింగు స్టేషను" అను పేరుతో జర్మనీ రేడియోయిట్లు ప్రకటించింది ——

> "ఇండియాను బలవంతంగా తప్ప పరిపాలించలేని స్థితి వచ్చిందని మా శ్రోతలకు మేము హెచ్చరించవలసి వచ్చింది"

బ్రిటిషువారి అభిప్రాయమే పైవిధంగానుందని వినేవా రనుకోవాలని పై రేడియో ఉద్దేశం. బ్రిటనులో అభిప్రాయభేదాలు కల్గించి, శ్రోతలకు గాభరా కలిగించి, బ్రిటిషు ప్రభుత్వవిధానం తమ కనుకూలంగా మార్చుకోవాలని వారి వుద్దేశం. ఇండియానుగూర్చి శత్రుప్రచారంయొక్క ద్రోహబుద్ధి యిందువలన స్పష్టంగా తెలియగలదు.

ఇండియా అంటే అక్షరాజ్యాలకు ఎంతో యేహ్యాభావం గలదు అది వారి "హిమాలయ రేడియో" ప్రసారమునందు తెలియగలదు. భారతీయులకు భారతదేశంనుండియే చెప్పుచున్నట్లుండాలని శత్రువుల ఉద్దేశం. హిమాలయ పర్వత మనోహర దృశ్యములు వర్ణించుటకు అపుడపుడు ప్రయత్నించి, యీస్టేషను ఇండియాలోనే ఉందని నమ్మించాలని ప్రయత్నిస్తున్నారు. ఆ వర్ణనలు సరిగానుండవు 1941 వ సం॥ మే 14 వ తేదీన యీ అక్షరాజ్యాల "హిమాలయం రేడియో" హిమాలయమంత పొరబాటుచేసి తన ఉనికి ఎక్కడో అవ్యక్తంగా బయల్పెట్టేసుకొంది. ఆనాడు రోము రేడియోలో హిందూస్తానీ భాషలో "హిమాలయను రేడియో" ప్రసారం మీటరు సంఖ్య మరునాటినుండి మార్చబడునని ప్రకటించబడెను. కాని ఆ హిమాలయను రేడియో ప్రసారంలో ఆ మార్పుగురించి సూచించలేదు. మరునాడు తప్పు గుర్తించి, "హిమాలయ రేడియో" తాను ముందుగా యీ మార్పుగురించి చెప్పనందుకు విచారం తెల్పి, రోము రేడియో 10 నిముసాలు కష్టపడి క్రొత్త మీటరు తెలుసుకొందని నుడివెను రోము రేడియో కష్టపడినట్లు యీ హిమాలయను రేడియోకి ఎట్లు తెలిసింది, యిది మీటరు మారుస్తున్నాదని చెప్పందీ ముందుగా రోముకి ఎలా తెలిసింది? ఇటువంటి పొరబాటులు జరిగేక హిమాలయను రేడియో స్టేషను మాయమయిపోయింది

#### 'అజదు హింద'

తరువాత యింకో బూటకం రేడియో స్టేషను 'అజదు హింద' అనుపేరన వచ్చింది. ఇది

గూడ చాలపొరబాటులు చేసింది. ఆగస్టు 30 వ తేదీ యిట్లు ప్రకటించింది· —

> "మదరాసులో యూరోపియనులు ఒంటరిగా పోవుటకుగాని, చీకటిలో బయటికి పోవుటకుగాని భయపడుచున్నారు."

ఇండియాలో అరాచకం ప్రబలియుందని అనుకోవాలని యిట్టి అసత్యాలు చెప్పుచున్నారు. అట్లా లేదని ఎవరికి తెలియదు గనుక? ప్రస్తుత స్థితిలో భారతీయులను భయపెట్టాలని అక్షరాజ్యాల రేడియో స్టేషనులు విశ్వప్రయత్నం చేయుచున్నవి. "భారతీయ స్వాతంత్ర్య సంఘం (ఇండియను ఇండిపెండెన్సు లీగు)" అని, యిత్యాది దేశీయ నామములతో టోకియో ప్రచార కార్యక్రమం జపాను వశమందున్న రేడియో స్థానములనుండి ప్రకటింపబడుచున్నది. "ఇండియను నేషనలు కాంగ్రెసు స్టేషను" అని క్రొత్తగ ఒకటి బెర్లిను సృష్టించింది. అది "అజదు హిందు" స్టేషను మీటరులోనే వచ్చును. ఈ రహస్యం ఎక్కువకాలం దాచలేక, "యీ క్రొత్త ప్రసారం విదేశాలకు పారిపోయిన భారతీయ దేశాభిమానులు చేయుచున్నారు" అని అజదు హిందునుండి ప్రకటించబడెను. అట్టివారిని "భారతీయ స్వాతంత్ర్యయోధులమని చెప్పుకునే దొంగల"ని హిట్లరు ఒకప్పుడు వర్ణించెను.

ఆగస్టు 21 వ తేదీన టోకియో యిట్లు తెలిపెను :—"భారతీయ సామాన్య జనులకు విపరీతమగు వదంతులు అనేకం అందజేయబడుచున్నవి." తన ప్రచారం లాభిస్తున్నదని టోకియో తానే భావించుచున్నది కాబోలును టోకియో రేడియో ప్రచారమే పూర్తిగ అసత్యములతో కూడుకొనియున్నది అంతకుముందే టోకియో రేడియోలో ఇండియాలో అనేక నగరాలు బాంబుచేయబడినవనియు, ఇండియా ప్రభుత్వంవారు రోగ క్రిములను వ్యాపింపజేసి భారతీయు లందరిని సమ్మూలంగా నాశనంచేయ దలంచిరనియు, చెప్పబడెను. ఇటువంటి వింత కథలు, ఇండియాకు ఎన్నో వేలమైళ్ళ దూరమునందున్న స్టాకుహోమునుండి వచ్చినవని చెప్పుదురు. అట్టి దుష్టప్రచారపు కథలు ఎక్కడ పుట్టినను, భారతీయులకు శత్రు ప్రచారోద్దేశములు బాగా తెలుసును కావున, యిటువంటి మాటలు విని మోసపోవరు.

---

# సమరరంగ చదరంగం.

పూర్వ మొక గృహస్థు తన భార్యతో ఇష్టాగోష్ఠిగా సంసారవిషయాలు మాట్లాడుకుంటూ, సంభాషణ సందర్భంగా అన్నాడట. "అయితానగరంలో ఉద్యోగం నాకు అయితే గియితే, అప్పుడు నేను ఒక ఆవును కొంటే గింటే, మన ఆవు పాలు ఇస్తే గిస్తే, ఆపాలతో నీవు పాయసంచేస్తే గిస్తే, ఆపాయసం ముందుగా నాకు వడ్డిస్తావా? నీతమ్ముడికి వడ్డిస్తావా?" అని భార్యను అడిగితే, ఆ యిల్లాలు "మా తమ్మునకే వడ్డిస్తాను" అని జవాబుచెప్పింది "ఆలాగయితే నేను ఆవును కొననే కొనను. అయితానగరంలో ఉద్యోగం చెయ్యనే చెయ్యను" అని ఆ భర్త జవాబుచెప్పి కోపంతో లేచి వెళ్లిపోయినాడు కోరినపనులు నెరవేరినా నెరవేరక పోయినా కోరికలుమాత్రం ముందంజవేసి పరుగెత్తుతూవుంటాయి జర్మనీకీ జపానుకూ ఏర్పడిన మైత్రికూడా పైన వర్ణించిన దాంపత్య సంబంధంమాదిరిగానే నడుస్తూఉన్నది. ఇటీవల ఒక విషయం వెల్లడిఅయింది. జపానుకు లోబడియున్న కొరియా రాజ్యంలో ఉన్నటువంటి అమెరికా ప్రభుత్వ ప్రతినిధి ఇటీవల అమెరికా ప్రెసిడెంటుఅయిన రూజువెల్టుగారికి వ్రాసిన ఒక లేఖలో ఆవిషయం వెల్లడించియున్నాడు. గత జూను మాసంలోనే రష్యాలోని స్టాలినుగ్రాడు నగరమును వశపరచు కొనుచున్నామని జర్మనులు జపానువాళ్లకు తెలియజేశారట. జర్మనుల సంకల్పప్రకారంగా కార్యక్రమానుసారంగా గత జూను మాసంలోనే స్టాలినుగ్రాడు నగరాన్ని జర్మనులు వశపరచుకొనినతోడనే, జపానువాళ్లు తమ సేనలను సైబీరియామీదకు దండెత్తిస్తామని జర్మనులకు మాటయిచ్చి ఖరారుచేసికొన్నారట. ఆప్రకారంగా తప్పకుండా జూను మాసంలోనే సైబీరియా మీదకు దండెత్తుటకు సిద్ధంగా వున్నానని జర్మనీకి జపాను ఖరారునామాకూడా వ్రాసియిచ్చిందట. జూను మాసం వెళ్లిపోయింది- జూలై మాసం వెళ్లిపోయింది- ఆగస్టు మాసంకూడా వెళ్లిపోయింది-

సెప్టెంబరు మాసం నడుస్తోంది. ఇంకా స్టాలిను గ్రాడు నగరపు వెలుపలి ప్రాకారములలోనే జర్మను సేనలు రష్యను ఫిరంగులకు ఆహూతి అవుతున్నాయి. నిన్నటివార్తలనుబట్టి చూస్తే, కొత్త రష్యను సేనలు స్టాలినుగ్రాడువద్దకు వచ్చి చేరినవని తెలుస్తోంది ఆ నగరంలోనికి జర్మను సేనలను అడుగు పెట్టనీయకుండా ఆ రష్యను సేనలు అఖండంగా మొండి భల్లూకపు పట్టుతో యుద్ధం చేస్తున్నాయి అక్కడ జర్మనులు ఐదు లక్షల సేనతో యుద్ధం చేస్తున్నారని మొన్న నీ మధ్యనే వార్తలు వచ్చాయి వేయి జర్మను విమానాలు ఆ యుద్ధరంగంలో అహోరాత్రాలు ఆకాశయుద్ధం చేస్తున్నాయి జర్మనుల ఆశ మాత్రం ఆకాశమంత నోరుతెరచుకొని స్టాలినో గ్రాడు నగరమును మింగవలెనని జూను మాసం నుంచీ ప్రయత్నిస్తోంది స్టాలినోగ్రాడు నగరం వాళ్లవశం అవుతుందో కాదో గాని, జర్మను సేన మాత్రం ఆహూతి అవుతోంది

జర్మనులకు స్టాలినోగ్రాడు వశమైతేగదా సైబీరియామీదకు జపాను సేనలు దండెత్తుట సంభవించడం అక్కడ స్టాలినోగ్రాడు నగ రాన్ని మ్రింగవలెనని జర్మనులు నోరుతెరచుకొని కూర్చుంటే, ఇక్కడ సైబీరియాను మ్రింగవలె నని జపానువాళ్లు నోరుతెరచుకొని కూర్చున్నారు. జర్మనీయొక్క కోరిక నెరవేరుట నిజమైనా, కాకపోయినా, జపానుకుమాత్రం కోరికలు తీగెలు సాగినట్లుగా సాగుతున్నాయి భర్తకు అయితా నగరంలో ఉద్యోగం లభించనేలేదుగాని, భార్య మాత్రం పాయసంకోసం నోరుతెరచుకొని కూర్చుంది. మొత్తంమీద రష్యాలోని కాకసను ప్రాంతంలోనికి జర్మనులు పూర్తిగా ప్రవేశించిన అనంతరం జపానువాళ్లు కొత్త దండయాత్ర యొకటి ప్రారంభించదలంచుకున్నారని బోధపడు తోంది.

జర్మను సేనలు కాకసను పరగణాను యావత్తూ ఆక్రమించకపూర్వమే జపానుసేనలు కొత్త దండ యాత్రకు సిద్ధముకావలెనని జపాను ప్రధాన మంత్రియైన టోజోగారు సంకల్పించారు. జపాను సైన్యాలు చాలాభాగం చైనాలో ప్రస్తుతం యుద్ధం చేస్తున్నాయి. చైనాలోని చికియాంగు రాష్ట్రము నున్నూ, కియాంగ్సీ రాష్ట్రమునున్నూ ఆక్ర మించుకోవలెనని సంకల్పించి జపాను సేనలను చైనాలో ఎక్కువగా చేర్చి ఇటీవల జపాను ప్రభుత్వం ఆ రాష్ట్రాలలో తీవ్రంగా దండయాత్ర సాగించింది. చాలా పట్టణాలను ఆ రెండు రాష్ట్రా లలో జపాను సేనలు ఆక్రమించినవి. చికియాంగు రాష్ట్రం చాలా ముఖ్యమైనది. ఆరాష్ట్రం చైనా సముద్రతీరంలో ఉంది. జపానుకు ఎదురుగా ఉంది ఆ సముద్రతీరపు రేవులలో మంచి విమానాశ్రయాలు ఉన్నాయి. ఈ విమానాశ్ర యాలు చైనావారివశమందే యుండుటవల్ల ఆ విమానాశ్రయములలో అమెరికను విమానాలు స్థావరమేర్పరచుకొని, ఎదురుగావున్న జపాను మీదకు దాడివెడలి, జపానుదేశానికి ముఖ్యపట్టణ మైన టోకియోనగరంమీద యిటీవల బాంబులు వేసివచ్చినవి చికియాంగు రాష్ట్రపు సముద్ర తీరమునుంచి అమెరికను విమానాలు సమీపంగా వున్న జపానుమీదకు సులభంగా దండెత్తి రాగ లవు. కనుక ఆ సముద్రతీరములో అమెరికను విమానాలకు ఆశ్రయంలేకుండా చేయుటకై చికి యాంగు రాష్ట్రమును వశపరచుకోవలెనని జపాను సేనలు చికియాంగు రాష్ట్రంలో ప్రవేశించి చాలా భాగం ఆక్రమించినవి కాని యిప్పుడు జపాను సేనలు సైబీరియామీదకు దండెత్తవలసిన అవ సరం ఉన్నదనిచెప్పి, చైనాలో పోరాడుచున్న జపాను సేనలను అక్కడనుంచి తొలగించవలె నని జపాను ప్రధానియగు టోజోగారు ఉత్తరువు చేశారు. చికియాంగు రాష్ట్రంలోని జపాను సేన లున్నూ, కియాంగ్సే రాష్ట్రంలోని జపాను సేన లున్నూ, మరొక క్రొత్త దండయాత్రకొరకై ఉద్దేశింపబడి, ఆరాష్ట్రములలోనుంచి తొలగింప బడుటవల్ల, అచటి చైనా సేనలు ఇదే సమయ మని విజృంభించి, అంతకుపూర్వం అచట జపాను సేనల వశమైన పట్టణాలను ప్రాంతాలను అన్నింటిని చైనా సేనలు తిరిగి ఆక్రమించుకొను చున్నవి. ఈవిధంగా జపానువాళ్లు జయించిన చికియాంగు రాష్ట్రాన్ని తిరిగి పోగొట్టుకొన్నారు. చికియాంగు రాష్ట్రంలో అమెరికను విమానాలు నిరామాటంగా మకాముచేయుటకున్నూ, అచటి నుండి జపానుపై బాంబులువేసి జపానులోని పట్టణములను ఫ్యాక్టరీలను ధ్వంసంచేయుటకున్నూ అమెరికను విమానాలకు తిరిగి మంచి అవకాశం లభించుచున్నది. ఇటువంటి స్థావరం అమెరికను విమానాలకు అక్కడ లభించడం జపానుకు చాలా ప్రమాదకరం. కనుక చైనాలో పోరాడు చున్న జపాను సేనలను చైనాలోనుంచి తొలి

గించి, అక్కడ జయించిన చికియాంగు రాష్ట్రి మునుకూడా వదలుకొని, మరొక క్రొత్త దండ యాత్రకు బయలుదేరడం జపానుకు శ్రేయస్కరమా ప్రమాదకరమా? ఈవిషయమై జపాను మంత్రులు చర్చించకుండా ఉంటారా? చర్చించి రాద్ధాంత సిద్ధాంతములు తప్పకుండా చేసే ఉంటారు. అభిప్రాయ భేదాలుకూడా ఏర్పడి యుండగలవు. జపాను విదేశాంగమంత్రియైన టోగోగారు ఇటీవల తమ మంత్రిపదవికి రాజీనామాకూడా దాఖలుచేశారు. ప్రధానమంత్రియగు టోజోగారు నిర్ణయించిన యుద్ధతంత్రాన్ని విదేశాంగమంత్రియైన టోగోగారు అంగీకరించక పోవుటవల్లనే టోగోగారు రాజీనామా యివ్వడం సంభవించిఉంటుంది

అక్కడ కాకసను యుద్ధరంగంలో జర్మను సేనలు జయించి ఆ కాకసను రాష్ట్రిమును ఆక్రమించకపోయినప్పటికీ, ఇక్కడ చైనాలోని జపాను సేనలుమాత్రం కొంతవరకు జయించి ఆక్రమించుకొన్న చికియాంగు రాష్ట్రిమునూ, కియాంగ్సీ రాష్ట్రిమునూ వదలుకొనుచున్నవి. సైబీరియాను ఆక్రమించవలెననే ఆశతో జపాను ఆందోళనపడుతోంది, కాకససును ఆక్రమించవలెననే ఆశతో జర్మనీ అవస్థపడుతోంది.

ఇదే సమయమనియెంచి బ్రిటిష్ ప్రధానియగు చర్చిలుగారున్నూ, అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టుగారున్నూ కొత్త చదరంగపు ఎత్తులు వేస్తున్నారు. ఈజిప్టులో బ్రిటిష్ సేనలను, అమెరికను విమానాలను అపారంగా సమకూర్చి అచటి జర్మను సేనలను ఒక్క అడుగైనా ముందుకు రానియ్యకుండా అడ్డగించి, గడ్డి తిని పించి బ్రిటిష్‌సేనానులు యీజిప్టులో బాగా విజృంభిస్తున్నారు. అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టు తన తరఫున రాయబారిగా పంపిన వెండెలు విల్కీగారు మొన్ననే టర్కీకివచ్చి ఒక మాట అన్నారు. జర్మనీని మరొకవైపునుంచి బ్రిటిష్‌వారుకూడా దెబ్బకొట్టుటకు ఆలోచిస్తున్నారు. రష్యా యుద్ధరంగంలో జర్మను సేనలు బాగా దెబ్బతినుచున్నప్పుడు రెండో యుద్ధరంగంలో జర్మను సేనలను బ్రిటిష్‌వారుకూడా ఎదిరించి కొట్టవలెనని సంకల్పించివున్నారు. ఈ రెండో రంగం యీజిప్టునుంచి ప్రారంభింపబడవచ్చునని వెండెలు విల్కీగారు అన్నారు.

ఇదేవిధంగా జపానుసేనలనుకూడా కొట్టవలెనని అమెరికావారు ఆలోచిస్తున్నారు. సైబీరియామీదకు దండెత్తవలెనని జపాను సేనలు పోయినప్పుడే జపానుమీదకు చైనాలోని చికియాంగు ప్రాంతంనుండి అమెరికను విమానాలు దాడి వెడలి జపానును భస్మంచేయగలవు. ఇదివరలో జపానువారు ఆక్రమించిన సాలమను దీవులలోనుండి జపాను సేనలను వెడలగొట్టి ఆ దీవులను అమెరికను సేనలు ఆక్రమించి, అచట అమెరికనులు కట్టుదిట్టం చేస్తున్నారు. ఈ దీవులలో అమెరికావారికి స్థిరంగా స్థావరం లభిస్తే జపానుమీదకు దండెత్తుటకై అమెరికావారుకూడా రెండో యుద్ధరంగం తయారుచేశారనేమాట నిశ్చయం. ఈవిధంగా అటు జర్మను సేనలను రెండు రంగాలలో హతముచేస్తూ, ఇటు జపాను సేనలనుకూడా రెండురంగాలలో హతముచేస్తూ, నాలుగు రంగాలలో సమరం సాగించుటకు సర్వసన్నాహములతో సిద్ధంగా వున్నామని అమెరికా ప్రభుత్వమున్నూ, బ్రిటిష్ ప్రభుత్వమున్నూ ధైర్యంగా చెప్పుచున్నవి.

ఈ నాలుగురంగముల చతురంగం సాగినప్పుడు శత్రువుల కిక ఊపిరిసలుపదు. జర్మనీని మద్దెల వాయించినట్లుగా అటూ యిటూ రెండు చెంపలూ కొట్టడమవుతుంది జపానునుకూడా రెండువైపులనూ దెబ్బకొట్టి డోలువాయించినట్లవుతుంది. ఈవిధంగా ఉభయ శత్రురంగ మృదంగం వాయించే సుముహూర్తం సమీపించింది. సమరరంగ చదరంగం సాగబోవుచున్నది మిత్రమండలి జయభేరీ దిక్కులు పిక్కటిల్ల మారుమ్రోగెడి సుముహూర్తం సమీపించుచున్నది. ధర్మమే జయిస్తుంది. అధైర్యానికి అవకాశంలేదు.



✻

జర్మనీ ఆక్రమించిన ఫ్రాంసునుండి రెండు త్రోవుడు పడవలలో తప్పించుకొని ఐదుగురు ఫ్రెంచి యువకులు ఇంగ్లాండు తీరంచేరిరి. బ్రిటిషు ప్రధాని చర్చిలుగారు తమ యింటికి వారినిపిలచి "చాంపేను" త్రాగనిచ్చిరి. వారు డిగాలు గారి స్వతంత్ర ఫ్రెంచి సేనలో చేరిరి.

✻

# చర్చిలు ప్రధాని యుద్ధ సమీక్ష.

## విముక్తి త్వరలో రానున్నది

## రష్యా ప్రశంస—బ్రిటను స్థితి బాగుపడింది

బ్రిటిషు పార్లమెంటులో చర్చిలు ప్రధాని 8 వ తేదిన యుద్ధ సమీక్షచేసిరి. వారు యిటువంటి సమీక్షచేసి తొమ్మిది వారాలు గడిచింది. ఈ మధ్య జరిగిన యుద్ధ చర్యలను పేర్కొనుచు ముఖ్యమైనది మాల్టాదీవికి సప్లయి నౌకల కాన్వాయి చేరుటయనిరి. ధైర్యముతో చిరకాలము శత్రు దాడులను ఎదిరించి నిలచియున్న యీద్వీప దుర్గమునకు కొన్ని నెలలవరకు సరిపోవు ఆహారము యుద్ధ సామగ్రి చేరినదనిరి. బలవత్తరమగు నౌకాదళము మూడు విమాన వాహక నౌకలతోగూడ కాపలాయుండి, జిబ్రాల్టరుదాటి సార్డీనియానుండి దారిపొడుగునవున్న శత్రు జలాంతర్గాములను తప్పించుకొని, చాల ప్రమాదములు దాటించి నౌకలను మాల్టా చేర్చెననిరి. ఈ ప్రయాణంలో జరిగిన యుద్ధమునందు కలిగిన నష్టము కలిగిన ఫలితమునుబట్టి చూచినచో ఎక్కువని చెప్పుటకు వీలులేదనిరి.

ఫ్రాంసులో డిపీరేవుపై బ్రిటిషు సేనలు జరిపిన దాడి చాలతీవ్రమైనది. యుద్ధము సాగుకొలది యిట్టి దాడులు ఎక్కువగ జరుగగలవు. శత్రుదేశంపై ముమ్ముందు జరుగు పెద్ద దాడులకు యిది ప్రారంభ సూచనయనియు, యిందు శత్రువుకి తమకు సరిసమానమగు నష్టం కలిగిందనియు చర్చిలుగారు తెలిపిరి. ఈ దాడి జరిపిన సైన్యంలో ఎక్కువ భాగం కనడానుండి వచ్చినదనియు, బ్రిటనులోనికి అమెరికాసేనలు అతివడిగా ఎక్కువగ వచ్చుచున్నవని శత్రువుకి తెలియగలదనియు, కాని, అవి ఎప్పుడుఎక్కడ తమపైపడునో తెలుసుకోలేకుండా ఉన్నారనియు చెప్పిరి. అమెరికావారు ఆస్ట్రేలియా సహాయంతో సాలమను దీవులలో కొన్నింటిని శత్రువులనుండి తిరిగి తీసుకొనుటగూర్చి తెలిపి దానివలన మిల్నిబేపై జపాను దాడి నిరోధింపబడినదనియు, యీ యుద్ధంలో ఆస్ట్రేలియావారి 'కంబరా' అను నౌక మునిగిపోయినందున వారికి 'ష్రాపు షైరు' అను నౌకను బదిలీ యిచ్చితిమని తెలిపిరి.

"గత నాల్గు వారములలో యుద్ధం మన కనుకూలంగా తిరిగింది. మిత్రమండలికి విమాన శక్తి అధికంగానేయుంది. గత నాల్గు నెలలలో జర్మనీపై నింతకాలంలోకన్న రెండురెట్లు అధికంగా బాంబులు వేయబడెను. అమెరికావారి బాంబరు విమానాలు చాల ఎక్కువగ తోడ్పడు

చున్నవి నౌకల నష్టములు యింకను ఎక్కువగనే యున్నవి కాని జూలై, ఆగస్టు, సెప్టంబరు మాసములందు అదివరకుకన్న తక్కువ నష్టం కలిగెను. ఈ మూడు నెలలలో నౌకల నిర్మాణాలుకూడ మునిగినవాటి సంఖ్యకన్న ఎక్కువ యున్నది. శత్రు నౌకా నిర్మాణకేంద్రాలపై మన దాడులు ఎక్కువైనందున వారి జలాంతర్గాముల నిర్మాణం తగ్గియుండును.

జూలై మాసంలో రూజువెల్టు అధ్యక్షుడు తమదేశ సర్వసేనాధిపతికి, నౌకా దళాధికారిని, తన తరపున హారీహాపుకిన్సుగార్ని ఇంగ్లాండు పంపిరి. ఆ రాయబారులు 10 రోజులుండి యుద్ధక్రమమంతా చర్చించిరి. యూరోపులోనేగాక ప్రపంచం అన్ని మూలల యుద్ధరంగములందు భావికార్య విధానము, ఉత్పత్తి విధానముగూర్చి బ్రిటను-అమెరికాలకు ఏకీభావం కుదిరెను ; ప్లానులు నిర్ణయించబడెను " అని ప్రధాని తెలిపెను

### ఈజిప్టు యుద్ధం

తాను ఈజిప్టు-మాస్కోలకు పోయివస్తినని దెలిపి, చర్చిలుగారు ఈజిప్టులోని యుద్ధ పరిస్థితుల గూర్చి యిటుల దెలిపిరి :—యడారి సైన్యము, ఈజిప్టు సైన్యముల స్థితి సంతృప్తికరంగా లేకుండెను. ఎల్ గజాలాచుట్టు జరిగిన యుద్ధాలవలన, ఎల్ అలామినువరకు మరలివచ్చునపుడు కొన్ని డివిజనులు చెదరి, తాత్కాలికంగా ప్రత్యేక సైనిక గుంపు లేర్పాటయినవి అయినను యీ సైన్యముకూడ జర్మనులను ముఖాముఖీ ఎదిరించినచో తప్పక గెలువగలరని సైనికోద్యోగులందరు విశ్వసించుచున్నారు ఈజిప్టులో సేనాధికారులను మార్చుట అవసరమని తోచింది. అచట సేనాధికారి జనరలు అచినులేకుగారిని వారి కోరికపైనే శలవిచ్చి, వారిస్థానే జనరలు అలగ్జాండరుగారిని నియమించితిమి అష్టమ సైన్యానికి నాయకుడుగ జనరలు గాటుగారిని పంపదలచగా వారు యుద్ధంలో చనిపోయిరి. అందుచే జనరలు మాంటుగమరీగారు ఇంగ్లాండులో చాల అవసరంగానున్నను, వారిని ఈజిప్టుకి పంపవలసివచ్చెననిరి. వారు అష్టమ సేనాధిపతిగనున్నారనిరి క్రొత్త సేన విశేషంగా ఈజిప్టుకి పంపబడినది. టాంకులు, ఫిరంగులు, మోటారులుగూడ విశేషంగా అక్కడకు పంపబడినవి ఇకముందు శత్రు దాడిని నిరోధింపగల ఘట్టిసైన్యం సరంజామాతోకూడ అచటనున్నదనిరి. రోమెలు సేనాని తన సేనను పెంచి తిరిగి దాడి ప్రారంభించినను, సర్వసిద్ధంగానున్న బ్రిటిషు సేనను ఎదుర్కొనవలసివచ్చెననియు, అతని ప్రాత యెత్తులు యిపుడు సాగలేదనియు, గత వారం ఈజిప్టు యుద్ధం అసంతృప్తికరంగాలేదనియు చెప్పిరి. ఎడారి సేనకు రాయలు విమానదళం బాగా తోడ్పడిందనిరి.

### రష్యాకు సహాయం

మాస్కోనగరంలో తాను అమెరికా ప్రతినిధియగు హారిమెనుగారును రష్యా ప్రధాని స్టాలినను, విదేశాంగా మంత్రి మాలటావుగార్లతో నాలుగు రోజులు దీర్ఘంగా అన్ని విషయములు నిష్కపటంగా చర్చించితిమనిరి. " ఒక్కమాట చెప్పవలసియున్నది మనము కాని అమెరికనులుగాని రష్యనుల భారం తొలగించుటకు తగిన సహాయం చేయుచున్నామని వారు భావించుటలేదు. వారికి చాలనష్టం కలుగుటచే అట్లు భావించుటలో వింతలేదు. కాని వీలైనంత త్వరలో ఎన్ని నష్ట కష్టాలకేనా లక్ష్యం చేయక వారికి సహాయంచేయ స్థిరసంకల్పం కలదని వారి నాయకులకు మేము నమ్మకం కలిగించితిమి " అని చెప్పిన పిదప చర్చిలుగారు, స్టాలినుగారిని ప్రశంసించి, యిట్టి కష్ట సమయమున నాయకునకు ఉండవలసిన గుణములన్ని వారికి యున్నవనియు, హిట్లరు తత్వము నాశనంచేయుటకు చివరవరకు పోరాడుటకు రష్యనులు స్థిర సంకల్పం కలిగియున్నారనియు, రష్యనులు స్వభావసిద్ధంగా శాంతి ప్రియులేగాని వారిపై నాజీల అకార్యములవల్ల వారి స్వభావం మారిపోయిందని స్టాలినుగారు తెలిపిరనియు చెప్పిరి.

ముందు తరములవారికి నీతిగరపుటకుగాను, అనేక దుర్మార్గములు చేయుచున్న నాజీలను వారేదేశాలలో ఆ పనిచేయుచున్నారో అచటనే శిక్షించాలని రూజువెల్టుగారు తెలిపిన భావంతో బ్రిటిషు ప్రభుత్వంకూడ ఏకీభవించుచున్నదని చర్చిలుగారు చెప్పి ముగించిరి.

# అమెరికా ఖండమునందు సఖ్యత.

## రూజువెల్టు సౌహార్ధతయే పెంపొందించెను.

అమెరికా ఖండమునందు అమెరికా సం॥ రాష్ట్రములు కాక మరి 21 స్వతంత్ర్య రాజ్యములున్నాయి వాటన్నింటి సఖ్యత యేర్పాటులు 19 వ శతాబ్దాంతమునుండి సంకల్పించబడినను, 1933 లో, రూజువెల్టుగారి అధ్యక్షత ప్రారంభమయినప్పటినుండియే లాటిను అమెరికా రాష్ట్రాలలో సఖ్యత పెంపొందింది. వారును, వారి విదేశాంగ మంత్రి కార్డెలు హలుగారును పొరుగు దేశాలయడ ఆదరణ యెక్కువ చూపుచూవచ్చిరి "డాలరు నీతిని" వారుభయులు మార్చివేసిరి. లాటిను అమెరికాలో శాంతి కాపాడుటకై కర్రపెత్తనం విధానం పనికిరాదని వారు గుర్తించి, అన్యోన్య సంప్రదింపుల సభలు యెక్కువచేసిరి ఈ నూతన విధానంవలన మంచి ఫలితము చేకూరెను యుద్ధం దాన్ని పెంపొందించెను

1936 లో బోనో అయిరిసునందు జరిగిన అఖిల అమెరికా రాజ్యాల సభయందు అమెరికా ఖండంయొక్క శాంతికి భంగం కలుగనున్నపుడు అన్ని రాజ్యాలు కలసి సంప్రదించు కునేందుకు అంగీకరించినవి. 1938 లిమాలో జరిగిన సభయందు సమిష్టి ఒడంబడిక అమలు జరిగే సాధనము నిర్ణయించబడెను 1939 వ సం॥ సెప్టంబరులో నేటి యుద్ధం ప్రారంభం అయినాక పెనామాలో జరిగిన సభయందు యీ సాధనము అమలు జరిపిచూచి సంతృప్తిచెందిరి 1940 లో ఫ్రాంసు పతనానంతరం క్యూబాదీవియందు హవానాలో అఖిల అమెరికా రాజ్యముల సభ జూలై 21 నుండి 30 వరకు జరిగెను. ఈ సభయందు కార్డెలు హలుగారు ప్రారంభోపన్యాసము నొసంగుచు, శాంతిప్రియులై యితరులకు కోపం కలిగించకుండా ఉంటే చాలు తాము భద్రంగా నుండవచ్చని భావించువారికిగల ప్రమాదమును హెచ్చరించిరి అమెరికా ఖండానికి చేరువగా యూరోపు దేశాల వలసరాజ్యాలగు దీవులున్నాయి. యూరోపులో యుద్ధంవలన రాజ్యాలు చేతులు మారుచుండుటవలన యిక్కడ యీ వలసరాజ్యాలకు ఏమీ ఒడిదుడుకు రాకుండుటకును, అనుకూల పరిస్థితులేర్పడగానే వాటిని పూర్వపు యజమానులకిచ్చి వేయుటో లేక స్వాతంత్ర్యం యిచ్చుటో చేసి, అంతవరకు అమెరికా స్వతంత్ర్య రాజ్యాలన్నింటి తరఫున వాటిని ధర్మకర్తలుగా పాలించుటకును, ఆ వలసరాజ్యాలలో శత్రు ప్రచారం తొలగించి, ఆర్థిక సహకార విధానం స్థాపించి రక్షించు విధానమొకటి ఆ సభలో కార్డెలు హలుగారు సూచించిరి మన్రో సిద్ధాంతం ప్రకారం అమెరికాఖండం రక్షణ బాధ్యత అంతా అమెరికా సం॥ రాష్ట్రాల ప్రభుత్వందే అందుచే ఫ్రాంసువారివగు కరేబియను సముద్రంలోని మార్టినిక్యూ, ఫ్రెంచి గయానా, మున్నగు దీవులను హల్లుగారపుడు రక్షింపదలచి అట్లనిరి. అప్పటిలో ఇంగ్లాండు, హాలెండుల స్థితిగూడ ఒడిదుడుకులు గానున్నందున, ఆమెరికా ప్రాంతములందున్నవారి వలస రాజ్యములకుగూడ ముప్పుండెను.

తరువాత యుద్ధం ప్రపంచంలో అన్ని మూలలకు వ్యాపించింది పెర్లు హార్బరుపై దాడితో అమెరికా ప్రత్యక్షంగా యుద్ధంలో దిగినపుడు, అదివరకు అఖిల అమెరికా రాజ్యాల సభ నిర్ణయించిన విధానం బాగా తోడ్పడింది. 1942 వ సం॥ జనవరి 1 వ తేదిన సంతకాలుపెట్టిన 26 సంయుక్త రాజ్యాలలో తొమ్మిది లాటిను అమెరికా రాజ్యాలే. అవన్నిగూడ యిపుడు అక్షరాజ్యాలపై యుద్ధం ప్రకటించినవి. ఇటీవల మరి రెండు-మెగ్జికో బ్రెజిలు-దేశ ప్రభుత్వాలు గూడ సంయుక్త రాజ్యాలలోచేరి అక్ష రాజ్యాలపై యుద్ధం ప్రకటించినవి

### మెగ్జికో ఆటంకం తొలగింది

1942 వ సం॥ జనవరిలో బ్రెజిలునందున్న రియోడీ జనీరాయందు జరిగిన అమెరికా రాజ్యాల విదేశాంగ మంత్రుల మూడో సభయందు మెగ్జికో విదేశాంగ మంత్రి సీనరు ఎజాకిలు పడిల్లాగారు యిలాగన్నారు —"వేకుదీవి ఫిలిప్పైను దీవులందు యుద్ధంలో చనిపోయిన అమెరికను సైనికులు యావదు అమెరికా సౌభాగ్యముకొరకు, మానవకోటి స్వాతంత్ర్యం కొరకు ప్రాణత్యాగం చేసిరి కాని కేవలం సంయుక్త రాష్ట్రముల గౌరవంకొరకు మాత్రమేకాదు. ఇరువదైండ్ల క్రిందట మెగ్జికో మాటలకు యీ మాటలకు ఎంత భేద

మున్నది ? అప్పటి యుద్ధంలో మెగ్జికో అమెరికా సంయుక్త రాష్ట్రములకు శత్రువుగానుండునని ఎంచబడుటచే ఆ సరిహద్దునందు విలువగల సం॥ రాష్ట్ర సైనిక నివహములు స్థిరంగాఉండిపోవలసివచ్చింది అవప్పుడు యూరోపులో జర్మనీని అణచుటకు ఎంత ఉపయోగపడియుండును ? రియోడిజనీరాయందు జరిగిన సభయందు అమెరికా రాజ్యాలన్ని అక్ష రాజ్యాలతో సంబంధం తెంచుకోవాలని తీర్మానించబడెను తమ తీరానికి చేరువనే తమ స్టీమరులను అక్ష రాజ్యాల జలాంతార్గాములు ముంచుటచేత కోపంవచ్చి మెగ్జికో బ్రెజిలు దేశాలు యిటీవల యుద్ధం ప్రకటించినప్పటికీ, దీనివలన అమెరికా స్వతంత్ర రాజ్యాల నైతిక సఖ్యత వెల్లడియగుచున్నది.

వస్తు సహాయం

లాటిను అమెరికా రాష్ట్రములు నైతికముగనే కాకుండా భౌతికముగగూడ సంయుక్త రాష్ట్రములకును, మిత్ర రాజ్యములకు చాల సహాయము చేయుచున్నవి ఇంగ్లాండు-అమెరికా దేశాలలోని ఫ్యాక్టరీలకు ఎన్నో ముడి పదార్థములను పంపుచున్నవి జర్మను జలాంతర్గాములను ముంచుటకు నౌకాదళ విమానదళ సహాయములు చేయుచున్నవి

ఇరువయ్యొక్క అమెరికా రాజ్యములందు ద్వేషాలు తగవులు కలిగించాలని అక్ష రాజ్యాలు ఎంత ప్రచారంచేసినా, రూజువెల్టు అధ్యక్షుడు దూరదృష్టితో అనుసరించిన విధానంవలన కలిగిన అఖిల అమెరికా రాజ్యాల సఖ్యత యింతంతని చెప్ప వీలులేదు. శత్రు ప్రచారం విఫలమగును

---

# భారతదేశ ప్రాముఖ్యత.

## పరిశ్రమలలోను సైనిక వ్యూహములందును అమెరికాకు మిగుల తోడ్పడగలదు.

ఈ యుద్ధం భూగోళమంతకు సంబంధించినదని అధ్యక్షుడు రూజువెల్టుగారొకసారి అన్నారు ఈ భూగోళ యుద్ధమునందు సంయుక్త రాజ్యాలన్నియు ఒకదానికొకటి ఎంతో తోడ్పడగలవు. అందుకు ఆయా దేశాలు ప్రక్క ప్రక్కన యిరుగుపొరుగునే యుండ నక్కరలేదు; దూరాన ఉన్నాగూడ తోడ్పడగలవు ఇందుకు నిదర్శనము ఇండియా-అమెరికాలే.

శాంతి సమయాలందు అమెరికాకు ముఖ్యంగా మనదేశంనుండి జనుము, తోళ్లు, లక్క, ముడి ప్రత్తి, ముడి ఉన్ని యిటువంటివి ఎగుమతయ్యేవి. ఇపుడు అమెరికాకు ముఖ్యంగా యుద్ధ సామగ్రియే కావాలి కనుక, అభ్రకం, మాంగనీసు, లోహపు యిసుక, దుంప నూనెలు యిత్యాదులు పంపబడుచున్నవి. ఇండియాయొక్క జనుమునార అమెరికాకు ఎంతో అవసరం. ఇది యిక్కడనుండి పోకుంటే, దీనికి బదులు యింకో వస్తువు యింకోచోటునుండి తెప్పించుకొనుటకు అమెరికాకు చాలదండుగగును. అమెరికాకు ఇండియా పరిశ్రామికంగా సహాయపడునని చెప్పుటకు యిదో నిదర్శనం.

మాంగనీసులేనిది ఉక్కు తయారుకాదు మాంగనీసు ఇండియాలో సాలుకి 10 లక్షల టన్నులు తయారగుచున్నది ప్రపంచమంతటి ఉత్పత్తిలో మూడోవంతు ఇండియాలోకలదు. ఎలక్ట్రికు సామానులు తయారుచేయుటకు అభ్రకం రేకులు అవసరము అభ్రకం, రేకులు దిమ్మలు ప్రపంచమంతటి ఉత్పత్తిలో $\frac{4}{5}$ వంతు ఇండియా గనులనుండేవచ్చును ఇవిగాక యుద్ధ పరిశ్రమలకు అవసరమగు బాక్సైటు, ఇలుమేటు, క్రోమైటులుగూడ విశేషంగా యిచట లభించును.

అమెరికా చేరువ దేశాలనుండికూడా యీ ముడిపదార్థాలు తెప్పించుకుంటుంది కాని అమెరికాలో పరిశ్రమల వృద్ధియగుటకు ఎంతో అవకాశాలున్నాయి గనుక, ముడి పదార్థాలు ఎంత పండినా చాలదు అచట కార్మికులకు కొదువలేదు, యంత్ర సామగ్రి విశేషంగలదు, కావున

అమెరికా ఎక్కువగా యుద్ధ పరిశ్రమల ముడి పదార్థములకై ఇండియాపై ఆధారపడియున్నది. అన్నింటికన్న ఎక్కువ జనుము అమెరికాకు పోవుచున్నది ఇండియాలో నిది సాలీనా 90 లక్షల బేళ్లు తయారగును పశువులుగూడ ప్రపంచమంతటి సంఖ్యలో ⅓ వంతు ఇండియాలో గలవు కావున తోళ్లు చర్మముల ఎగుమతి కూడ ఎక్కువైనది, నూనె విత్తులుగూడ అన్ని దేశాలకన్న ఎక్కువగ ఇండియాలోనే తయారగును. ఇంకా యెన్నో చిల్లర పదార్థములు ఇండియానుండి విశేషంగా అమెరికాకు పోతున్నవి

కాపాడుచున్నంత కాలం శత్రురాజ్యాలు రెండు కలియలేవు భూమార్గమునగూడ ఇండియా నైసర్గిక పరిస్థితులు చాల ముఖ్యమైనవి బర్మా, మలయా, తాయిలాండులు జపాను వశమైయున్నందున చీనాకు సహాయమంతా ఇండియా మీదుగనే చేరవలెను ఆ దేశాలనుండి జపానువారిని తరిమివేయాలంటే ఇండియానుండే ప్రయత్నించాలి ఆలాగే మధ్య ప్రాచ్యాదేశములగు ఇరాను, ఇరాకు, సిరియా, పాలస్తీనా ఈజిప్టు దేశాలకు సహాయంకూడ ఇండియానుండే పోవాలి ఎర్రసముద్రములోను ఆఫ్రికా తూర్పు-పడమర తీరములపైన అధికారంకూడ చాల ముఖ్యమైనదే.

# సంశయాత్ముడుగా నుండుము !

తనకు నిజమని తెలిసేవరకు
దేనిని నమ్మనివాడు సంశయాత్ముడు.

వదంతుల విషయమున మీరు సంశయాత్ములు కండు.

మిమ్ము తప్పుదారి ద్రోయుటకు
అవి జపానులో సృష్టియగుచున్నవి

## * వదంతులను నమ్మకండి. *

జపాన్ను ఎదుర్కొనుటకు
జాతీయ యుద్ధరంగం తయారుచేయుడు



### సైనిక ప్రాధాన్యత

సైనిక వ్యూహాలందుగూడ అమెరికాకు ఇండియా ఎంతో అవసరం అటు జపానువారిని యిటు మధ్య ప్రాచ్యంలో అక్షరాజ్యాలను రెండింటిని ఎదుర్కొనుటకు సైనికులనుంచుటకు వారికి సప్లయిలు చేయుటకును ఇండియా కేంద్రస్థానంగా నుండగలదు ఇండియా యీ రెండు యుద్ధ రంగాలకు ఎదురుగనేయుంది. అటుండి జపాను సేనలువచ్చియు, యిటుండి జర్మనీ-ఇటలీ సేనలువచ్చియు కలిసిపోకుండ మధ్య ఇండియా అడ్డంగానుంది. అట్లా అవి కలవకుండుట ప్రపంచ శ్రేయమునకు, భావి యుద్ధ గతికి ఎంతో అవసరము. ఇండియాలోను సింహళములందలి సైనిక శిబిరాలనుండి హిందూ మహాసముద్రమును సంయుక్త రాజ్యాల సేనలు కాని, జపాను సైనిక శక్తికి నౌకాదళ శక్తికి ఇండియా లొంగిపోతే, ఆ తీరాలను రక్షించుకోగలమా అని సందేహంగావుంది. హిందూ మహాసముద్రంలో, తూర్పున ఆస్ట్రేలియానుండి పడమరను ఆఫ్రికా తూర్పు తీరమున మడగాస్కరువరకు అడుగు భాగముగా గల త్రికోణమునకు ఇండియా శిఖరం వంటింది ఈ మూడు కీళ్లలో యేదిపోయినా చాల నష్టముకలుగును

నాజీ శక్తి ఎన్నడైన కాకసను కొండల అడ్డుదాటి ఇరానులో ప్రవేశించగల్గినచో ఇండియా ప్రాముఖ్యత ఇనుమడించును. అక్కడకు దరినున్న ఇరాను, ఆఫ్గానిస్తాను, ఇరాకు దేశాలు ఇండియాను రక్షించు డాలువలెనున్నవి వాటిని జయప్రదంగా కాపాడుకోవాలంటే, నాజీ సైన్యాలపై తిరుగు దెబ్బ కొట్టుటకు ఘట్టి శిబిరం

ఒకటి ఉండాలి అక్కడనుండి సైన్యాలు సరకు యుద్ధ రంగాలకు అతివడిగా పోతూవుండాలి ఇండియా అటువంటి శిబిరంగా నుండగలదు

ఇటువంటి వ్యూహాలున్నందున ఇపుడు ఇండియాలో అమెరికా సేనలుండుట ఎందుకో సులభంగా అర్థం కాగలదు. ఈ యుద్ధంలో అక్షరాజ్య సైన్యాలను ఎదిరించుటకు ఎటువంటి శిబిరాలైన అమెరికాకు చాల ఉపయోగపడగలవు. జపాను ఆక్రమించిన బర్మాలో సైనిక నివహములపైని, అండమాను దీవులలో వారి శిబిరాలపైని అమెరికా బాంబరు విమానాలు బాంబులు వేయుట యీ యుద్ధంలోని ఘట్టమే శత్రువుపై దాడిచేయుటకు ఇండియా ఒక శిబిరంగా అమెరికాకు యిదివర కుపయోగపడింది, యిక ముందుగూడ ఉపయోగపడగలదు

ప్రస్తుత యుద్ధం ప్రపంచమంతా చుట్టివేసినదైనా కొన్ని రంగాలుమాత్రం ప్రత్యేకంగా ముఖ్యమైనవిగా నెంచవచ్చును.

ఇండియా అటువంటి రంగము సంయుక్త రాజ్యాల యుద్ధ వ్యూహంలో ఇండియా బాగుగ వినియోగించబడును.

---

# అధ్యక్షుడు రూజువెల్టుగారి ఉత్పత్తి కార్యక్రమము.

1942 లో 60,000 విమానాలు, 45,000 టాంకులు, 20,000 విమాన విధ్వంసక ఫిరంగులు, 8,000,000 టన్నుల వర్తక నౌకలు తయారుచేస్తాం 1943 లో 125,000 విమానాలు, 75,000 టాంకులు, 35,000 విమాన విధ్వంసక ఫిరంగులు, 10,000,000 టన్నుల వర్తక నౌకలవరకు యీ ఉత్పత్తి పెరుగును అని అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుగారు గత జనవరిలో తెలిపెను. అపు డందరికి ఆశ్చర్యం కలిగింది ఇపుడా కార్యక్రమం బాగా కొనసాగుచున్నది

ఫ్రాంసు పడిపోయేసరికి అమెరికాలో అధ్యక్షుడుగ ఫ్రాంక్లిను డి రూజువెల్టుగారుండడం గొప్ప అదృష్టం జర్మనీ, జాపానుల దౌష్ట్యము ప్రబలి యుద్ధం ప్రారంభంకాకముందే వాటివలన అన్నిదేశాలకు కలుగనున్న ముప్పును రూజువెల్టుగారు గుర్తించిరి ఈ రెండుదేశాల దురాక్రమణ విధానం దూరాన్నవున్న తమ అమెరికాకుగూడ ముప్పు తెచ్చిపెట్టునని తన ప్రజలకు నచ్చజెప్పుటకు చాల కష్టపడెను.

అందుకు తగినట్లుగ వారు పనిచేసిరి. వారి మొదటి అధ్యక్షతకాలమునందే (1933-37) అనేక నౌకలు క్రొత్తమోస్తరుగ మార్చబడి, క్రొత్తవాటికి అస్తిపంజరాలు వేయబడినవి. రెండోసారి అధ్యక్షుడైనపుడు నౌకాబలం బాగా పెంచెను నిరుడు యీయేడు చాల విమాన వాహక నౌకలు, యితర యుద్ధనౌకలు నిర్మించబడి నౌకాదళంలో చేరినవి.

1940 జూనులో ఫ్రాంసు జర్మనీకి లొంగిపోవుసరికి అమెరికాలో యింకా కొద్ది కర్మాగారాలే యుద్ధకార్యాలు చేయుటగాంచి, అధ్యక్షుడు ప్రజలందరిని రేడియోద్వారా హెచ్చరించి, ఫ్రాంసు పతనంవలన అమెరికాకుగల ముప్పు సవిస్థరంగా తెలిపి అమెరికనుల కర్తవ్యం బోధించెను ఆయేడే అమెరికాలో వయస్సువచ్చినవారంతా సైన్యంలో నిర్బంధంగా చేర్చుకొనబడే చట్టం కావింపబడెను.

50 యుద్ధనౌకలు అమెరికావి ఇంగ్లాండుకి యివ్వడం 1940 సెప్టంబరులో అధ్యక్షుని ప్రోత్సాహంవల్లనే జరిగింది యుద్ధంలో అమెరికా వైఖరి నిర్ణయించుటకు యీ నిదర్శనం చాలకపోతే, 1941 జనవరిలో అరువు కవులు చట్టం గావించుట గమనింపవచ్చు దానితో అమెరికాలో కర్మాగారాలన్ని యుద్ధ పరికరాలు తయారుచేయుచు క్రొత్త కర్మాగారాలుగూడ త్వరగ నిర్మింపబడినవి వాటిని యుద్ధరంగాలకు మోసుకపోవుటకు కావలసిన స్టీమరులను కట్టుటకు క్రొత్త నౌకా నిర్మాణశాలలుకూడ నిర్మించబడినవి.

### జాపాను రాక

ఈరీతిగ అధ్యక్షుని దూరదృష్టివలన, జపాను యుద్ధంలో దిగి 1941 డిశంబరు 7 న పెర్లుహార్బరుపై బాంబులు వేసేసరికి అమెరికా పూర్తిగ ఏమరియుండలేదు. 1942 జనవరిలో అధ్యక్షుడు హెచ్చరించి, తన ఆయుధోత్పత్తి కార్యక్రమం ప్రకటించేసరికి అదివరకు యుద్ధ

యుద్ధ సహాయ కృషి అమితంగా వృద్ధిపొందెను. ప్రతికూలురుగనున్నవారుగూడ అనుకూలురయిరి.

అధ్యక్షుడు సూచించిన కార్యక్రమం పూర్తిగ కొనసాగునా? ఆపని ఎంతవరకు జరిగిందో వివరాలు తెల్పుటకు వీలులేదు. అది రహస్యం కాని 1942 వ సంవత్సరాకి అనుకున్న పనులన్ని పూర్తిగ జరుగుటేకాక, కొన్నింట అనుకున్న దానికన్న ఎక్కువే జరుగుతుందని రూఢిగా చెప్ప వచ్చును.

జూలై, ఆగస్టు మాసాలలో విమానాలు నెలకు 50,000 చొప్పున తయారైనవి. డెట్రియటునందు ఒకచోట ప్రపంచమంతటిలో పెద్దదగు ఒకే అంతస్తుమేడ అరమైలు పొడుగు, ¼ మైలు వెడల్పుగలది యున్నది ఇందు ఫోర్డుగారు 90,000 పనివారిని నియమించి 24 గంటలు పనిచేయించుచున్నారు. గంటకో నాలుగింజనుల బాంబరు విమానం యిందులో తయారు కాగలదు. మందుగుండు, తోటాలు, గుండ్లు తుపాకులకు లెక్కలేదు లిబియా ఎడారిలో యుద్ధానుభవము ననుసరించి క్రొత్త రకం టాంకులు తయారుచేయబడుచున్నవి

సంయుక్త రాజ్యాల నౌకలు చాల జర్మలు జలాంతర్గాములచే ముంచబడినవని అందరికి తెనుసును ఆగస్టులో మునిగిన నౌకలకన్న తయారైన నౌకల సంఖ్య ఎక్కువయింది జూలైలో 71 సామాను నౌకలు, ఆగస్టులో 68 క్రొత్తవి ప్రయాణం ప్రారంభించినవి పడమట తీరాన ఒక నౌకా కేంద్రమునందు పని ప్రారంభించిన 24 గంటలలో ఒక నౌక పూర్తి చేయబడినది. ఇట్లా జరగడం అరుదు అధ్యక్షుడు సూచించిన సంఖ్యను మించి 1942-43 వ సం॥లలో 18,000,000 టన్నులుకాక 25,000,000 టన్నుల నౌకలు నిర్మింపబడగలవు. 1942 వ సం॥ జూను సరికి 12,500,000 పనివారు యుద్ధ పరిశ్రమలందు పనిచేయుచుండిరి 1943 వ సం॥ ఆఖరుకి 20,000,000 మంది పనిచేయ గలరు.

అధ్యక్షుడు సూచించిన కార్యాక్రమం చాల అధికమయినదే అయినా, అమెరికా ఉత్పత్తి శక్తికి మితిలేదు ముడివస్తువులు ఎంత ఎక్కువగ లభిస్తువుంటే అంత ఎక్కువగ యుద్ధ సరకుల ఉత్పత్తి జరుగుచుండును

---

# బ్రిటను యుద్ధ కృషి.

## ఉత్పత్తి యెక్కువగుట, సివిలు ఖర్చులు తగ్గి యుద్ధ వ్యయం యెక్కువచేయుట.

ఇటీవల కొద్ది వారములనుండి బ్రిటనులో ప్రతిదినం 12,250,000 పౌనులు (1 పౌను రూ 13-5-4 లు) ఖర్చగుచున్నట్లు కోశాధికారి సర్ కింగుస్లేవుడుగారు పార్లమెంటులో చెప్పిరి. గత రెండేండ్లలో ఆయుధోత్పత్తి యెక్కువయినందు ప్రభుత్వ ఖర్చు చాల పెరిగింది 1940-41 వ సం॥లో బ్రిటను వ్యయం 38,840 లక్షల పౌనులనుండి యీ యేడు 52,860 లక్షలకు పెరిగింది ఖర్చులో నూటికి 40 వంతు పన్నుల నుండి వసూలగుచున్నవి 1938 వ సం॥లో బ్రిటిషు ప్రభుత్వం మొత్తం రాబడిలో 1/6 వంతు యుద్ధానికి ఖర్చు పెడుతూవుండెను మూడేండ్లలో సగం యుద్ధ ఖర్చు క్రింద మారింది. ప్రజలు అనవసరమయిన వస్తువులు తయారు చేయకుండా శాసించి అవసరమగు వస్తువులనే నిర్బంధంగా ప్రభుత్వంవారు చేయించుచున్నందున యీ వ్యయముచేయ వీలయినది. పైగా పన్నులు అధికంచేసిరి.

ప్రజలలో సగంమంది యుద్ధరంగాలలో పోరాడుచు, మిగతా సగం దేశంలో యుద్ధ కార్యాలు చేయుచుండునట్లు మంత్రి బెవినుగారో కార్యక్రమం తయారుచేసిరి బ్రిటనులో ఫ్యాక్టరీలు, అనేక భాగములుగ విభజించి ఒకే కేంద్రమునందుండక వివిధ తావులందుంచుటచే, శత్రు విమానాల దాడివలన నష్టంలేకుండా పరిశ్రమలు కొనసాగుచున్నవి

ఆగస్టునుండి నవంబరువరకు నాలుగు నెలలలో లండనులో విమానాలు నిరిటికన్న రెండింతలు యెక్కువ తయారు చేయబడినవి.

బ్రిటను ఆయుధోత్పతి అత్యద్భుతంగా పెరిగి పోవుచున్నది. 1941 లో సుమారు 10,000 విమానాలను ఇంగ్లాండు విదేశపు యుద్ధరంగా

లకు పంపింది  ఏడాదికి 40,000 పెద్ద ఫిరంగులు, 250 లక్షల రౌండుల మందుగుండు ఇంగ్లాండులో తయారగుచున్నది

బ్రిటనుకి నౌకలు ప్రాణ ప్రదమయినవి హిట్లరుయొక్క నీటిపాములగు జలాంతర్గాములు బ్రిటిషు నౌకా నిర్మాణశక్తిని తగ్గించలేకపోయినవి. యుద్ధానికి పూర్వం మూడు నెలలోకన్న 1941 ఆఖరు మూడు నెలలలో నాల్గు రెట్లు అధికంగా నౌకలు నిర్మించబడినవి  గత ఏడాదిలో నూటికి నూరు రెట్లు బ్రిటను ఆయుధోత్పత్తి అధికమయింది

ఇందు కనుగుణ్యంగా ఇంగ్లాండులో అన్ని రకముల ఆహార పదార్థముల ప్రత్యేక వ్యక్తులకు కొలతగ యిచ్చుచున్నారు  వారానికి 2 ఔన్సుల వెన్న, 2 ఔన్సుల తేయాకు తప్ప యెక్కువగ యెవ్వరికి యివ్వరు  పండ్లు దొరకవనే చెప్పాలి  ఈ కష్టాలన్ని ప్రజలు విసుగుకోకుండా భరించుచున్నారు  4,000 లక్షల ఎకరములు అధికంగా సాగుచేయుచున్నారు  ప్రజలు ఎవరికి కావలసిన కాయగూరలు వారే పండించుకొంటున్నారు  వస్త్రముల వాడుకకూడ తగ్గించబడెను  యుద్ధంలో జయించిన పిమ్మట గూడ యీ గృహ సమస్యలు కొంతకాలంవరకు నేటివలెనేయుండును, వస్తువులకు కంట్రోలు ఉండవలెనని సర్ కింగ్స్లే వుడుగారనిరి

---

# వైస్రాయి కార్యవర్గంలో పని.

## సర్ ఫిరోజిఖాను నూనుగారి ఉపన్యాసం.

ఇండియా ప్రభుత్వం దేశరక్షణశాఖ సభ్యులుగ వైస్రాయి సంఘమునందున్న సర్ ఫిరోజిఖాను నూనుగారు, ఇండియాలో ప్రస్తుత పరిస్థితులనుగూర్చి యొసంగిన ఉపన్యాసంలో కొన్ని భాగములు యిందుగలవు —

వైస్రాయిగారి కార్యవర్గ సభ్యులందరు అతని చెప్పు చేతుల్లో ఉంటారు, నౌఖరులకు ఆర్డరులిచ్చినట్లు అతను ఉత్తరువు చేస్తూవుంటే మేము శిరసావహించి పనిచేస్తూవుంటాం, మాకేం నోరు లేదని ఒక అభిప్రాయం దేశంలో ప్రబలియుంది. అదే నిజమయితే మాలో ఒక్కరంగూడ ఆ పనిలోఉండం. 1941 అక్టోబరు 3 నుండి నేను పనిలోనున్నాను , ఒక్కసారిగూడ వైస్రాయి నా సలహా త్రోసివేయలేదు  9½ సంవత్సరాలు పంజాబు గవర్నరువద్ద మంత్రిగ పనిచేసినపుడు యిట్లే జరిగింది  గవర్నరులు మంత్రుల సలహాలను విని తీరాలని రాజ్యాంగ విధానంలో శాసింపబడినది  వైస్రాయిగారు చట్టబద్ధమగు రాజుగారు ప్రవర్తించినట్లే ప్రవర్తించిరి  నాతోటి సభ్యులుగూడ అట్లే చెప్పిరి  వారి అనుభవంకూడ అంతే, కొన్ని సమయాలందు వివాదాంశాలు చర్చకువచ్చినపుడు ఒక్కసారిగూడ తన సంఘంలో అల్పసంఖ్యవారి కనుకూలంగా అదిక సంఖ్యవారి నిర్ణయము వైస్రాయి ఎన్నడు నిరాకరించలేదు. యూరోపియను సభ్యులుగూడ అన్ని విషయములు వాటి అర్హతలనుబట్టియే విచారించి న్యాయంగానే నిర్ణయించేవారు.

ప్రస్తుత ఇండియా చట్టంలో 9 వ షెడ్యూలునందు ప్రాత చట్టంలోని 41 సెక్షను యింకను అమలునందున్నదనియు, కార్యవర్గంలో అధిక సంఖ్యావర్గం అభిప్రాయం ప్రకారం గవర్నరు జనరలు చేయవలసియుండుననియు ఇండియాలో పెక్కంద్రకు తెలియకపోవచ్చును  అందిట్లు గలదు —

> గవర్నరు జనరలుగారి కార్యవర్గమునందు చర్చింపబడిన విషయంలో భిన్నాభిప్రాయాలు కలిగినచో సభాయుతుడయిన గవర్నరు జనరలు హాజరయి యున్నవారిలో అధిక సంఖ్య అభిప్రాయమును అనుసరింపవలెను  సంఖ్యలు సరిసమానంగా నున్నచో గవర్నరు జనరలుగాని అధ్యక్షత వహించినవారుగాని 2 వ వోటు యివ్వవచ్చును

బ్రిటిషు ఇండియాయొక్క శ్రేయమునకు విరుద్ధంగానున్నపుడు, తాను అధిక సంఖ్యాభిప్రాయంతో ఏకీభవించనపుడు గవర్నరు జనరలు తన సంఘం నిర్ణయమును అతిక్రమించవచ్చునని ఒక మినహాయింపుగలదు  కాని అట్టి సందర్భంలో భిన్నాభిప్రాయంగల సభ్యులలో ఏ యిరువురైనను తమ భిన్నాభిప్రాయము ఇండియా మంత్రికి తెలుపమని కోరవచ్చును. కాని ఇంత

వరకు యీ మినహాయింపు. ఒక్కసారిగూడ అమలు జరుగలేదు తన సంఘ సభ్యుల అనుమతితో చట్టసమ్మతంగా చేయరానిపని యేదియు చేయుటకు గవర్నరు జనరలుకి యీ సెక్షను అధికారం యిచ్చుటలేదు

ఇంగ్లాండులో రాజుగారికి నిరాకరించే అధికారం ఉన్నా మంత్రివర్గంలో అధికసంఖ్యా అభిప్రాయమే అమలు జరుగుచున్నది అటువంటి ఆచారమే ఇండియాలోగూడ స్థిరపడినది కాంగ్రెసు రాష్ట్రాలలో ముస్లిములకు కాగితాలపై ఒసంగబడిన రక్షణలేమి ఉపయోగపడినవి ? ఇపుడీక్షణాన ఉన్న మంత్రివర్గంలో అధికసంఖ్యగానున్న భారతీయ సభ్యులద్వారా 'అధికారం చెలాయించాలి

అనేకవిషయాలు వైస్రాయికి తెలియ నవసరంలేకుండా కార్యవర్గసభలో సభ్యులచే నిర్ణయింపబడును. కొన్ని ముఖ్యమగు విషయములందు అందుకు సంబంధించిన సభ్యుని నిర్ణయమును వైస్రాయిగారు వినవత్తురు , రెండుశాఖలు భిన్నాభిప్రాయాలు కలిగియున్నపుడు అతి ముఖ్యమగు విషయాలు క్లిష్టసమస్యలు చర్చింపబడునపుడుమాత్రమే కార్యవర్గసభకు వైస్రాయిగారు అధ్యక్షత వహింతురు. 16 గురు సభ్యులలో 11 గురు భారతీయులే. కనుక పరిపాలనా శాఖలలో యెన్ని యిపుడు భారతీయుల చేతిలో నున్నవో చూడండి. 11 వ భారతీయ సభ్యుడు యిపుడు ఇంగ్లాండులో యుద్ధమంత్రి వర్గములో చేరబోయెను. వైస్రాయిగారు యిపుడు విదేశీయాంగ శాఖను, ఇండియా చట్టంలో పేర్కొనబడిన కొన్ని ప్రత్యేక బాధ్యతలను నిర్వహించుచున్నారు.

క్రిప్సు సందేశం

సర్ స్టాఫర్డు క్రిప్సుగారు యీదేశం వచ్చినపుడు వైస్రాయిగారితో కలసి 13 స్థానాలలో తొమ్మిదిలో భారతీయులుండిరి. ఈ రాయబారాలు బాగుగ కొనసాగాలని మేమంతా వాంఛించి, ఆంగ్లేయ సభ్యులతోసహా మేమంతా ఖాళీచేసి, పెద్ద రాజకీయ పక్షముల ప్రతినిధులువస్తే వారికీ స్థానాలు యివ్వాలని నిశ్చయించుకొంటిమి. తానే యీ సంఘ సభ్యుడుగ ఎల్లకాలం ఉండాలని మాలో నెవ్వరు కోరలేదు మాలో అందరికి యితరులవలె స్వాతంత్ర్య వాంఛ గలదు. కాంగ్రెసు సంస్థలోనే దేశాభిమానులంతా వున్నారని మేమెన్న డంగీకరించము. నా భారతీయ సహోద్యోగులందరు తన దేశ స్వాతంత్ర్యం యితరులవలె కోరుచున్నారు కానియితరులు కొందరువలె మేము, మా సివిలు హక్కులకొరకు దౌర్జన్యం చేయాలని, ఎన్నడు రాజీపడరాదని నమ్ముటలేదు

కాంగ్రెసు రాజీ కంగీకరించలేదు. తాము అధికారం స్వీకరిస్తే కార్యవర్గంలో తమ నిర్ణయాలు బాధ్యతాయుత మంత్రివర్గం నిర్ణయములవలె అంగీకరిస్తామని బ్రిటిషు ప్రభుత్వం ముందుగా అభయమివ్వాలని కాంగ్రెసు కోరుట ఒక కారణంగా రాయబారాలు విఫలమయినట్లు చెప్పుచున్నారు రాజుగారికి, వైస్రాయికిగల నిరాకరణాధికారం తీసేయాలని వారు చూచేరు కుస్తీ పట్టిన యిద్దరిలో నేలపడినవాడిపై నెక్కి గుద్దుచున్నవాడుకూడా ఏడుస్తున్నాడుట ఏమిరా అంటే, వాడు తిరిగిలేచి తనను కొడతాడేమోనని ఏడుస్తున్నా నన్నాడుట. అలాగుంది కాంగ్రెసు వారిమాట. కాంగ్రెసు నాయకులకు ఇండియా ప్రభుత్వాధికారం యిస్తామంటే, ముందెపుడో భిన్నాభిప్రాయం వస్తుందన్న అనుమానంతో, తమ దేశానికి సేవచేసే అవకాశం వదలుకొన్నారు. నిరాకరించే అధికారం పై అధికారికి అన్ని దేశాలలో ఉండును. ఇంగ్లాండులో గలదు. ప్రజలచే ఎన్నుకొనబడినవారు యింతకూమనుష్యమాత్రులు. తరువాత తామే చింతించునట్టి పొరబాటులు వారిపుడు చేయవచ్చును కావున నిరాకరించే అధికారం పైన యింకొకరికి ఉంచేనేగాని దేశానికి చాల హాని కలుగవచ్చును అమెరికా సంయుక్త రాష్ట్రముల రాజ్యాంగ చట్టం యింత బిగువుగానుండును. వ్రాతచట్టమునందు కార్యవర్గంలో అధిక సంఖ్యకు యిట్టి అధికారం యివ్వడమేకాక, చాల దేశాలలో మంత్రివర్గాలు మనదేశంలోవలెనే, బిగువగు యీ చట్టాన్నిమాత్రమే అనుసరింపవు. ప్రతిచోట ఆచారమనే నియమాలు పుట్టి పెరుగుతాయి. ఇచ్చటగూడ వైస్రాయి ప్రధాన మంత్రివలెనుండి సహోద్యోగులలో అధికసంఖ్య నిర్ణయాన్ని అనుసరించాలను ఆచారం ఏర్పడింది. ఇట్లా వుంటూ వుంటే, ఏ పార్టీవారైన తాము ఉద్యోగం స్వీకరించకముందే తమమాట చెల్లాలని వ్రాతమూలకమగు అభయం కోరడం, నిర్హేతుకంగా అనుమానాలు వెలిబుచ్చుటయగును. చేయవలసిందేమంటే, ఉద్యోగం స్వీకరించి, మీ రనుకొన్న ప్రకారం జరుగకపోతే, వెళిపోతామని బెదిరించండి. అపుడు మీస్థితి మరీ బలంగా వుంటుంది.

# యుద్ధావసరములను ఇండియా తీర్చుట.

## గత మూడేండ్లలో కలిగిన మేల్లు.

### ముందు చేయనున్న పని

నాల్గోయేటి యుద్ధ ప్రారంభంలో నున్నాం ఇప్పుడు ఇండియాలో యుద్ధం తాకిడి తగలని పరిశ్రమలు చిన్నవిగాని పెద్దవిగాని లేవు. యుద్ధం మొదటి యేడు ఇండియాలో ఏయే పరిశ్రమలు యుద్ధానికి తోడ్పడగలవో పరిశీలించబడెను. రెండో ఏడు ఎట్లా పనిచేయించాలో ప్లానువేసేరు మూడు నాల్గో ఏడులందు ఆ ప్లానుల ప్రకారం పనిజరిగి పరిశ్రమలన్నీ యుద్ధ ప్రయత్నానికి తోడ్పడుట ఎక్కువయినది మొదటి యేడు యుద్ధానికి సరకు ఇండియాలో రూ 83 కోట్లు విలువగలది, రెండో ఏడాఖరికి రూ 165 కోట్లు, యీ యేడు జూలై ఆఖరికి రూ 365 కోట్లు విలువగలది కొనబడెను ఇపుడు నెలకు రూ 20 కోట్ల చొప్పున ఆర్డరులు వచ్చుచున్నవి.

తుపాకులు శాంతి సమయంలో తయారయ్యే వాటికన్న ఆరు రెట్లు అధికముగాను, మరఫిరంగులు ఎనిమిది రెట్లు, సున్నీలు పదిరెట్లు, మందుగుండు 24 రెట్లు, ఫిరంగులు ఫిరంగి బండ్లు తొమ్మిదిరెట్లు, యిపుడు తయారగుచున్నవి. క్రొత్తరకం పెద్దవి ఫిరంగులు, గుండ్లు, విమాన విధ్వంసక ఫిరంగులు, టాంకులను చేదించే గుండ్లు ఇండియాలో తయారుచేయబడుచున్నవి. ఈ అధిక ఉత్పత్తికి మొదట రూ 7 కోట్ల స్కీము మంజూరుచేయబడి యిపుడు మరో రూ 16 కోట్ల స్కీము అమలునందున్నది అనేక రకాల ఆసిడులు, యుద్ధ సామగ్రికి అవసరమగు మందులు తయారుచేయుటకు క్రొత్త యంత్రాలు స్థాపించబడినవి.

ఉక్కు యంత్రములు, పరికరాలు, మందుగుండ్లు తయారుచేయు నిపుణులగు పనివారు, ఇంజనీరులు రసాయన శాస్త్రజ్ఞులు యెక్కువ మంది మంచి శిక్షణ యొసంగబడుచున్నారు బెవిను శిక్షణ విధానం ప్రకారం 250 మంది శిక్షణ పొందుటకు ఇంగ్లాండుపోయి 122 మంది అప్పుడే వచ్చిరి. టెక్నికలు ట్రెయినింగు స్కీము ప్రకారం యిప్పటికి 39,000 మంది చేర్చుకొనబడిరి.

ఉక్కు తయారుచేయుటకు అవసరమగు లోహములు కొన్ని ఇండియాలో తయారగుచున్నవి. ఇండియాలో అల్యూమినియం ఉత్పత్తి చాల వృద్ధిచేయబడును.

మందుగుండు ఉత్పత్తికి డైరక్టరు జనరలుగారు యిపుడు 840 జనరలు ఇంజనీరింగు కర్మాగారములు, చిన్న పనిముట్లు తయారుచేయుటకు 300, మందుగుండు తయారుచేయుటకు 345 యితర కర్మాగారములు 23 రైల్వే కర్మాగారములను ఉపయోగించుచున్నారు.

వస్త్రములు.—1942 జూను వరకు రూ 120 కోట్ల విలువగల వస్త్రములు సైన్యానికి కొన్నారు. వచ్చే యేడు యిది రూ 70 కోట్ల వరకు పెరుగును. ఈ యేడు రూ 12 కోట్ల డేరాలు, రూ 5 కోట్ల కంబళీలు తయారుచేయించిరి నెలకు 100 లక్షల దుస్తులు తయారుచేయించబడుచున్నవి. యుద్ధానికి పూర్వం సైన్యానికి కావలసిన దుస్తులన్నీ ఒక ఫాక్టరీలో తయారగుచుండేవి ఇపుడు పది కర్మాగారాలు వాటికిచేరిన కుట్టుపని కేంద్రాలలో 100,000 పనివారు పనిచేయుచున్నారు విమానాలలోనుండి దిగు గాలి గుమ్మటాల కవసరమగు పట్టు మున్నగునవి స్థాపించుటకు ఒక ఫాక్టరీ స్థాపించబడెను.

గవర్నమెంటువారి జీను కర్మాగారము (హార్నెసు అండు సాడ్లరీ ఫాక్టరీ) యందు 2 నుండి 13 వేలమంది పనివారు పనిచేయుచున్నారు. వీరు కాక 700 కంట్రాక్టరులద్వారా వేలకొలది పనివారు పనిచేయుచున్నారు మొత్తం ఏడాదికి రూ 20 కోట్ల విలువగల సరకు తయారగుచున్నది. జోళ్ల ఉత్పత్తి 12½ లక్షల జతల నుండి 40 లక్షల వరకు పెరిగెను. కలప వాడుక గూడ 396,000 టన్నులు గలదు. 1942-43 లో రూ 6 కోట్ల విలువవరకు పెరుగును, కర్ర పరిశ్రమలలో 1942-43 సం॥లో రూ 4 కోట్ల విలువవరకు తయారగును.

నౌకా నిర్మాణం — ఇండియాలోనున్న వివిధ నౌకా నిర్మాణశాలలందు 30,000 మంది పని చేయుచున్నారు.

దొర టోపీలు 50 లక్షలు, నూలు నార కంబళ్లు 100 లక్షల గజాలు, నూలు గుడ్డ 10,000 లక్షల గజాలు దేశరక్షణ సైనికులకు ఏటా వినియోగపడుచున్నది. ఉన్ని పరిశ్రమ అంతా యుద్ధానికే వినియోగించబడుచున్నది. నూలు పరిశ్రమలలో నూటికి 35 వంతుమాత్రమే సైన్యానికి ప్రత్యేకించబడుచున్నది. దిగుమతులు తగ్గినందున సివిలు ప్రజల అవసరం తీర్చుటకు పరిశ్రమలో మిగతా భాగం విడువబడినది.

యుద్ధం వచ్చిందగ్గరనుండి వైద్యసహాయ పరికరములుగూడ ఇండియాలో ఎక్కువ తయారు చేయబడుచు ఇక్కడ సైన్యాలకు తగినన్ని యిచ్చుటేగాక సుమారు 80,000 రష్యాకు పంపబడెను. నెలకు రూ 4 నుండి 5 లక్షల విలువ గల సరకు తయారుచేయబడుచున్నది ఇంకా అన్ని పరిశ్రమలందు యిట్లు అభివృద్ధి జరుగుచునేయుంది.

## మద్రాసు పటాలములలో జనహాని

వేర్వేరు తేదీలయందు మద్రాసు పటాలములలో యీ క్రింది రీతిగా జనహాని కలిగినదని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము :—

| నెంబరు | హొదా | పేరు |
|---|---|---|
| | ఆఫీసర్లు | |
| | కనబడక చనిపోయినట్లు ఎంచబడినవారు | |
| ఐ ఎం ఎస్ | కెప్టను | ఎక్. ఇ సారంగపాణి |
| | యుద్ధ ఖైదీలుగనున్నట్లు రూఢియైనవారు. | |
| ఐ ఎం ఎస్ — | | |
| ఎం జడ్ 23503 | కెప్టను | ఎం జగ్గరాయను |
| | యుద్ధ ఖైదీలుగానుండి తిరిగి చేరినవారు | |
| ఇంజనీర్లు— | | |
| ఇ 112832 | జమదారు , | జి ఎస్ రావు |
| | ఇతర తరగతులు | |
| | చనిపోయినవారు. | |
| 102487 | గన్నరు | పి రామన్న |
| 100615 | లా హవల్దార్ | వీరస్వామి |
| 0/74159 | సిపాయి డ్రైవరు. | దొరైస్వామి. |
| | గాయపడినవారు | |
| ఎం టి. 985476 | సిపాయి | మణిరాము. |
| | యుద్ధ ఖైదీలుగా ఎంచబడినవారు, గాయపడినవారు | |
| 101190 | యు లా. నాయక్ | కృష్ణను నంబియారు |
| | కనబడక యుద్ధ ఖైదీలుగ నెంచబడినవారు. | |
| 101429 | గన్నరు | బాలకృష్ణనాయుడు. |
| ఎఫ్/551 | వెయిటరు | దొరయికన్ను |
| ఎఫ్/500 | వెయిటరు .. | గోపాలు |
| 106888 | గన్నరు . | కె గోపాలు |
| 101115 | డ్రైవరు .. | గోవిందస్వామి |

| నెంబరు. | హొదా. | పేరు |
|---|---|---|
| ఎఫ్/552 | వెయిటరు .. | ఎం మదురై |
| 101041 | నాయకు | ఐ రాజు |
| 101425 | హవల్దార్ | సవరిముత్తు |
| మదరాసు సేపర్లు, మైనర్లు— | | |
| 15467 | హవల్దార్ .. | అబ్దుల్ కుదాను. |
| 17980 | నాయకు | ఆరోగ్యసామి |
| 16021 | సేపరు | ఆరుముగం |
| 60860 | సేపరు | అయ్యా కోనారు |
| 16501 | నాయకు | చెల్లయ్య |
| 15503 | సేపరు | చిన్నకొలందై |
| 17832 | లా/నా | డేవిడు |
| 18525 | సేపరు | గోపాలాచారి |
| 65450 | సేపరు . | గోవిందస్వామి |
| 16669 | లా/నా | గోవిందస్వామి |
| 13758 | సేపరు | గురువ |
| 19008 | సేపరు . | రాజు |
| 17968 | సేపరు . | జోసెఫ్ |
| 60778 | సేపరు | కనకయ్య |
| 66216 | సేపరు | కందస్వామి |
| 17896 | సేపరు | కన్నను |
| 13934 | లా/నా | కోదండపాని |
| 19075 | సేపరు | కుల్లను |
| 16502 | సేపరు .. | లక్ష్మణను. |
| 18925 | హవల్దార్ ... | జి సి లింగస్వామి |
| 13962 | సేపరు | మహాదేవను |
| 60162 | సేపరు | మాణిక్యం పిళ్లై |
| 65184 | సేపరు | మొహిఉద్దీను |
| 60797 | సేపరు | మునికృష్ణను |
| 11937 | లా/నా | మునిస్వామి |
| 13117 | లా/నా | మునిస్వామి |
| 18509 | సేపరు . | ముసలయ్య. |
| 19020 | సేపరు .. | నాగమయ్య |
| 65801 | సేపరు | నరశింహన్ |
| 16492 | సేపరు | ఊలగనాడ |
| 16101 | సేపరు | పెరుమాళు |
| 18581 | సేపరు | రాజమానిక్యం |
| 19084 | సేపరు | రాజు. |
| 17504 | సేపరు | రామస్వామి. |
| 65459 | సేపరు | రామస్వామి. |
| 16998 | నాయకు .. | రంగసామి |
| 60632 | సేపరు '. | రత్నం |
| 13290 | సేపరు .. | సాబు సాహెబు. |
| 16186 | సేపరు ... | సతియనాడ |
| 18663 | సేపరు | షేకు బచాలాలు. |
| 18582 | సేపరు | షేకు మాబూబు. |
| 66045 | సేపరు | ఎస్ ఆదినారాయణ |
| 17922 | సేపరు . | శ్రీరాములు |
| 65269 | సేపరు | సుబ్రమణి |
| 14221 | సేపరు | తాంతోని |
| 60002 | సేపరు | వేదమాణిక్యం. |
| 13716 | సేపరు | వేలాయి |
| 16886 | సేపరు | వెల్లయను. |
| 60782 | సేపరు | వెంకటరామను |
| 17290 | సేపరు | యల్లయ్య |
| 60636 | సేపరు | అన్నామలై. |
| 18966 | సేపరు | అరులప్పను. |
| 60832 | సేపరు | ఆరుణాచలం. |

| నెంబరు. | హోదా | | పేరు |
|---|---|---|---|
| 17019 | హవల్దార్ | | చంద్రప్రకాశ |
| 60868 | సేపరు | | చంగల్వరాయుడు. |
| 60810 | సేపరు | | చిన్నస్వామి |
| 17973 | లా/నా | | దొరస్వామి |
| 13901 | సేపరు | | గోవిందరాజు |
| 17946 | లా/నా | | గోవిందస్వామి |
| 16014 | హవల్దార్ | | గురుమూర్తి |
| 17118 | సేపరు | | జగన్నాధను |
| 60119 | సేపరు | | జానకిరాం. |
| 17975 | సేపరు | | జోసెఫ్. |
| 18520 | సేపరు | | కందస్వామి |
| 16536 | లా/నా | | కన్నను |
| 67343 | సేపరు | | కన్నను నాయరు. |
| 60794 | సేపరు | | కృష్ణమూర్తి |
| 14862 | సేపరు | | కుప్పుస్వామి |
| 17836 | సేపరు | | లక్ష్మయ్య. |
| 18271 | సేపరు | .. | లూర్దునాదను. |
| 66120 | సేపరు | | మాణిక్యం |
| 18863 | సేపరు | .. | మొగలు కాశిం సాహెబు |
| 14766 | సేపరు | | మునియప్పను. |
| 15405 | సేపరు | ... | మునిరత్నం. |
| 14948 | లా/నా | | మునిస్వామి. |
| 60859 | సేపరు | ... | మునిస్వామి. |
| 17876 | సేపరు | | ముత్తుస్వామి. |
| 13667 | సేపరు | | నరశింహను. |
| 17011 | సేపరు | . | నటేశను. |
| 17953 | నాయక్ | | పార్థసారథి. |
| 17997 | లా/నా | | రహిముల్లా షరీ |
| 15462 | సేపరు | .. | రాజు. |
| 60806 | సేపరు | . | రాజు. |
| 14262 | సేపరు | | రామస్వామి రెడ్డి |
| 16879 | సేపరు | . | రామయ్యను. |
| 17860 | సేపరు | | రంగస్వామి. |
| 16691 | హవల్దార్ | ... | రేణుగోపాల్. |
| 15125 | సేపరు | ... | శంకరయ్య. |
| 17110 | లా/హ | .. | శల్వరాజు. |
| 60802 | సేపరు | | షేకు జమాలు. |
| 18955 | సేపరు | ... | షేకు మల్లికు అహమ్మదు. — |
| 14263 | సేపరు | . | సుబ్బరాయను. |
| 17278 | నాయక్ | .. | సుబ్రమనియను. |
| 65166 | సేపరు | .. | వేదాచలం. |
| 60475 | సేపరు | ... | వీరస్వామి. |
| 60789 | సేపరు | . | వెలంకన్ని. |
| 16329 | లా/నా | ... | వెంకటచలం, |
| 18445 | సేపరు | | వెంకటేశ్వర్లు. |

చనిపోయినవారు.

| | | | |
|---|---|---|---|
| ఐ.ఏ.ఒ.సి — | | | |
| ఒ/107688 | సేపరు | ... | అబ్దుల్ గఫూరు. |
| ఎన్ వై ఎ. | కూట్లుపని | . | ము జమాను. |
| ఒ/103654 | ఫిట్టరు | .. | టి ఎన్ రాజు నాయుడు. |
| ఒ/76483 | ఎస్ డి. | ... | సి. వేలుకుట్టి. |
| ఒ/119266 | సేపరు | .. | తామసు డికోస్టా. |
| 13368 | సేపరు | . | షాదాదు ఖాను. |

# ఇండియాలోని బంగారం వంటి పంటలు...



జర్మనీ స్వాధీనం చేసికొనిన యూరపు దేశాల్లో, జపాను స్వాధీనం చేసికొనిన చైనా ప్రాంతాల్లో పంటలను శత్రువులు కొల్లగొట్టుకొని పోతున్నారు. న్యాయంగా అనుభవించవలసిన రైతులు మలమలమాడి చచ్చిపోతున్నారు. మనకు ముఖ్యాధారము వ్యవసాయమైన ఇండియాలో ఇది జరగనివ్వగలమా ? అనేక ఉత్పత్తి సాధనాలున్న ఇండియాపై శత్రువుల కన్ను పడింది. మనలను లోబరచుకొనెందులకు జపాను తియ్యటి మాటలను చెప్పును. ఆ మాటల విషయంలో జాగ్రత్త సుమా ! జపాను వారు వచ్చిన మన స్త్రీలు, పిల్లలు మాడుటయే కనుక వారిని ఎదుర్కొనెందులకు సంయుక్తంగా మీ శక్తులను ఉపయోగించండి.

జపానువారి నెదుర్కొనుటకై జాతీయ యుద్ధ రంగమును తయారుచేయుడు.



MADRAS : PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.